## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



శ్రీకృష్ణః

—

# ప్రియమయిన బాలకుమారులారా!

ముందు వదిలోనికి రాదగిన మీకొరకు నేను కొన్ని హితవులను జెప్పబోవుచున్నాను. సావధాన చిత్తులై గమనించెదరని నమ్ముచున్నాను. ఇప్పుడు సాధారణముగ హిందువులలో నన్నిజాతులవారును బొట్టును జుట్టును నుంచుటలేదు. బొట్టు అనునది యందముకొరకు నేర్పడినదికాదు. దాని నుంచుకొనినచో నతడు హిందూ మతస్థుడని చూడగానే తెలిసికొనవచ్చును. అందు నుంచుకొను విధమునుబట్టి కొంతవరకు బ్రాహ్మణుడనియు నితరుడనియు దెలిసికొనవచ్చును. మరియు బొట్టు భేదములను బట్టియే మతత్రయములను గనిపెట్టవచ్చును. జుట్టు అనునది వైదికకర్మలకు సంబంధించి యున్నది. కర్మలు చేయుట తటస్థమయినపుడు కావలెనంటే జుట్టు అప్పటికప్పుడు మొలచునా? కావున మీరలు హిందూ మతస్థులకు ప్రధాన [illegible] జుట్టును నుంచుకొన గోరుచున్నాను.

# చుట్టలు కాల్చుట

మరియు మీయారోగ్యమునుగూర్చి కొంత చెప్పవలసి యున్నది. అనేకులగు డాక్టరులు ౧౮ సంవత్సరముల వయస్సులోగా చుట్టలు మొదలగువానిని త్రాగకూడదనియు, అటుల చేసినయెడల శరీరము బాగుగ పెరుగదనియు జెప్పుచున్నారు. అందు విశేషముగ జదువు స్కూలుబాలురు బొత్తిగ చుట్టలను సిగరెట్లను గాల్చకూడదు. జర్మనీలోను ఋష్యాలోను కొన్ని సంవత్సరములకు దక్కువ వయస్సుగల వారు చుట్టలను సిగరెట్లను త్రాగినయెడల శిక్షలను జేయుచున్నారు. మైసూరు రాజ్యములో నట్టి పద్ధతిని శాసించబోయెదరట. హెచ్చుకాలము చదువువారు పొగలు త్రాగుటవలన వారి (eye-sight) నేత్రదృష్టికిని, (heart) గుండెకును చెరుపు గలుగుచుండును. పొగలు త్రాగుటయేగాక మీలో మరియొక చెడు అలవాటు గలదు. అది యేమియనిన పొగాకుగుండతో తయారుచేయబడిన కిల్లీలు లేదా బీడాలను తరుచుగ స్కూలు బాలురు కొని చేయుచున్నటుల నాకు తెలియవచ్చినది. అవియు (heart) గుండెకు చెరుపు చేయును.

---



# త్రాగుట

త్రాగుటయను విషయము బాలురగు మీకు జెప్పవలసినది కానప్పటికి ముందు మీ మేలుకొరకు కొంత చెప్పబోవుచున్నాను. పూర్వకాలము మన దేశములో యుద్ధములకు బోవువారు పుష్పాసవములను దీసికొని యుద్ధములకు బోయినటుల గానవచ్చుచున్నది. గాని త్రాగుట, నిషాచేయు పదార్థములు అనగా సారాయి, భంగు, మాదుము మొదలగునవి తినుట శాస్త్రదూష్యమయి యున్నది. ఇప్పుడు త్రాగుట యన్నిజాతులలోను బలమగుచున్నది. అందు పశ్చిమదేశపు విస్కీ మొదలగునవి త్రాగుట ఒక (fashion) ఫేషన్ క్రిందికి తీసికొనుచున్నారు. పశ్చిమదేశస్థులు ఆ దేశములు చల్లని ప్రదేశములగుటవలన గొంతవరకు వేడిమి శరీరమునకు గలుగుటకు త్రాగుదురు. మరియు వారలుభుజించు బలపదార్థములు వారలుచేయు శరీర పరిశ్రమలు మనలో లేవు గావున వానిని మనము తీసికొని శరీర పరిశ్రమ యేమియుచేయక ఒకకూర,చారు,పచ్చడితో భోజనము చేయుటవలన మనలకు అనేకములగు జబ్బులు కలుగును. (Heart)గుండెను (Brain)మెదడును చెడగొట్టును.అజీర్ణమును గలిగించును. నరములయందు శక్తిని క్షీణింపజేయును. అట్టివారలకు పుట్టినబిడ్డలు బలహీనులయి యుందురు. కావున మీరలెప్పుడును నిషాచేయు తలంపునే కలిగియుండరని మిమ్మును నిండుగ గోరుచున్నాను. మితముగ త్రాగుట తప్పు లేదను

పశ్చిమ దేశస్థులు కొందరును అమెరికాలో కొందరును (Temperance Association) అను పేరుతో సంఘములుగ నేర్పడి త్రాగుట మానుకొనుచున్నారు. మన దేశమునకును మన శరీరములకును సరిపడనివియు, మన శాస్త్ర దూష్యమయినవియు నగు నిషాచేయువానిని మనమేల విసర్జించగూడదో మీరే యోచింపుడు.

## శుచి

మీద చెప్పిన దంతయు మీయారోగ్యము కొరకు చెప్పితిని. శుచినిగూర్చి నాలుగుమాటలను చెప్పబోవుచున్నాను. స్కూలు బాలురగు మీలోనేగాక (refined gentlemen) అను కొను వారిలోను దంతధావనము బాగుగ జేయుటలేదు. Europeans (పశ్చిమ ఖండస్థులు) పండ్లను తోమరని యొక భ్రమతో వానిని శుభ్రపరచుటయే మానుచున్నారు. లేదా శుభ్రముచేసినను బాగుగ జేయక యున్నారు. మనకును యూరోపియనులకును తినుపదార్థములలో భేదముగలదు. మనవలె క్షార కారములను వారలు తినరు. తాంబూలములను వారలు వేయరు. మనకు క్షార కార పదార్థములనుండియు తాంబూలములవలనను మనదంతము లెక్కువగ నశుభ్రతను జెందును. కావున మనము యూరోపియనులకంటె బాగుగ దంతములను శుభ్రముచేయవలెను. వారలు పండ్లను తోమరనేమాట కేవలము తప్పు. అయితే వారలు మనవలె నుదయమున విధిగ జేయరు; స్నానమువేళను tooth brush (టూత్ బ్రష్)తో పండ్లను

తోముదురు. అచేయుటలోను మనలో కొందఱివలె బాగుగ తోమక యుండవచ్చును. అటులని మనము ప్రాతఃకాల విధి కృతమగు దంతధావనమును మానుట చేయతగ్గ పనికాదు. కావున దంతధావనమును శ్రద్ధతో చేయుచు శుభ్రముగ స్నానము జేయగోరుచున్నాను.

## మీ విద్యాభివృద్ధి

చుట్టలు సిగరెట్లు కాల్చుట వల్లను కిల్లీలు బీడాలు వేయుటవల్లను మీనేత్రములకు గుండెకు చెరుపు గలుగునని మీద జెప్పియే యున్నాను. మీలో ననేకులకు పెద్ద (University) పరీక్షలను ప్యాసుచేయడపు తలంపులు గలిగియుండవచ్చును. అట్టి కోరికలను నిర్వహించుటకు మొదటియడ్డము బాల్యవివాహమయి యున్నది. మీరు University పరీక్షలకు బోవునపుడు యుక్తవయస్సులోనికి వచ్చియున్న మీభార్యలను పుట్టినింట నుంచుదురా? మీయింట నుంచుదురా? లేక మీతో మీరు చదివే చోటులకు తీసికొనివెళ్లి మీభార్యల సదుపాయములను సంరక్షణములకు గనిపెట్టుచుందురా? పుట్టినింటను మీయిండ్ల వద్దను నుంచినను మీకు మనోవ్యాకులత (anxiety) లేక మీరు బాగుగ జదువగలరా? మీరే యోచింపుడు. కావున మీది పరీక్షలకు బోవునభిలాషగలవారు వివాహములను మాని కృతార్థు

అగు సరికి అం ౘ్చే వారలను ముందు వివాహమాడవలెను. ప్రస్తుతము (Social reform) వారు రజస్వలా వివాహము బో ధించుచున్నారు. అది వాడుకలోనికి వచ్చినయెడల మీరు పరీ క్షలలో కృతార్థులయిన పయిని వివాహము చేసికొనవచ్చును. రజస్వలా పూర్వవివాహ నిబంధనలేనివారు పరీక్షలలో గృతా ర్థులయిన పయిని వివాహమాడవలెను. అయితే మీయింటి లోనున్న యొక ముసలమ్మయో యొక తాతయో మీవివాహ ములను జూచెదరన్న కోరికపయిని చాలమంది బాలురకు బా లికలకు వివాహములు జరుగుచున్నవి. మీ వివాహములకు ఫలితము ఆముసలివారలు చూచుటయేనా ? లేక మీరు ఈడు జోడు సరిపడిన వారలను వివాహమాడి యారోగ్యముగల బిడ్డలనుగని మీకుటుంబాభివృద్ధిని గోరుటయో? యో ంచింపుడు. మేనరికమని లేదా అట్టి కలిసివచ్చిన సంబంధముల పిల్లలు మించి పోవుదురని కొందరికి ద్వరలో వివాహములు జరుగుచున్నవి. అట్టిరక్త సంబంధ వివాహములు జరుగకపోవుట యారోగ్యకా రణమయి యున్నది. కావున నట్టి సంబంధములను సాధ్యమయి నంతవరకు మానుకొనవలెను.

## మీనడత

ఇంక మీనడత అనగా behavior గురించిచెప్పవలసియు న్నది. ప్రతివాడునుతనకంటె నధికుడు తటస్థమైనప్పు డేదోయొక

తరహా respect అనగా మర్యాదను గనబరుపవలెను. దండమును, సలామును bow అనగా తలను గొంచెము వంచుట చేయకపో యినను, నడుచుచున్నవాడు అడ్డముగ తిరిగి నిలువబడుటయు, లేదా అడ్డముగ దిరుగకపోయినను ఒక యడుగు ముందుకు వేయకయుండుటయు మర్యాదను గనబరచినట్లేయగును.

## EXAMPLE ఉదాహరణము

ఇందు కుదాహరణమును జూపెదను. ఈపట్టణమున మేము తటస్థమయినప్పుడు స్కూలుబాలురు, వృద్ధబ్రాహ్మణులు, వెలమవారు, కోమట్లు నేదోయొక మోస్తరు (respect) మర్యాదను జూపుచున్నారు. కొందరేవిధమయిన గౌరవమును గన బరుపరు. ఇటుల చెప్పుటవలన వారిని గౌరవమును గనబరుపు మని కోరుటకాదు. మరికొందరుగలరు. వారలొకనాడతివిధే యతను గనబరచుదురు. వేరొకనాడు (stranger) క్రొత్తవానిని జూచినట్లు చూతురు. మరియొకనాడు దృష్టినిసహా త్రిప్పక బండిని రాచుకొనునట్లు నడచిపోవుచున్నారు. ఈ త్రివిధము లగు నడతలకు గారణము గానరాదు. వీరును ఎప్పుడు నేవిధ మగు మర్యాదను గనబరుపని వారును నొక చిన్నయుద్యోగస్థుని గాని యీయూరిలో ప్రసిద్ధిజెందిన scoundrels (తుంటరులు) గాని తడస్థమైనప్పుడు వారుచేయు గౌరవ ప్రతిగౌరవములకు మితిలేదు. అందు మనరాజ్యప్రతినిధుల పట్ల నెక్కువ మర్యాదను గనబరుపవలెను. మీరలిప్పుడు రాజ్యప్రతినిధులపట్ల గౌర

వమును జూపుచున్నను మీలో కొందరు స్కూలువిడిచిన పిదప రాజభక్తిని పోని తులువలు చేయు( seditions) రాజద్రోహపు బనులలో చేరుచున్నారు. అట్లుచేయుటవలన మనదేశము యొక్క పద్ధతులను మీరినవారమై ఘోరనరకములోనికి పోదుమని తప్పక నమ్మి రాజద్రోహపు బనులను మీ మీజన్మలలో నెప్పుడును జేయమని మీమనస్సులయందు నమ్మి ఆనమ్మికను దృఢపరుచుకొనుచు మీయావజ్జీవము రాజభక్తిగలిగి మనదేశమునకు మనమతములకు గలగౌరవమును స్థిరపరుప మిమ్మును పదేపదే కోరుచున్నారు.

తే-గీ॥ సాదరమ్ముగ బ్రభుని, విద్యాప్రదాత ।
లను, గురుల, దైవమును బోలెఁ గనుచు, రాజ ।
భక్తితోడను జీవించువరకు నుంట ।
యర్హకృత్యము మీకు విద్యార్థులార ॥



Commercial Press, Madras. S. E.